# భావతరంగాలు

(ఏలలు, సుద్దులు, చిందులు,
బుర్రకథలు మొదలయినవి)

---

వున్నవ లక్ష్మీనారాయణ

---

చెన్నపురి:
ఆంధ్రపత్రికా ముద్రాలయమున
ముద్రితము.
౧౯౩౩

దీని వెల 0-1-0

# భావతరంగాలు

---

## ౧

### ఏల

(సంగదాసు అను పంచమనాయకుని హత్య జరిగినతరువాత ఉత్తర క్రియలు జరుగు సమయమున పాడబడిన చరమ గీతము.)

1. వుండా నిల్లా-సందా నేలా-వండా పొయ్యా-దుండా సయ్యా
ఎంత పోకా-పోలా చెండేసు ఓగాంధ దేవా! ఎంత సుందా వను
కుండేరు.

2. చేతా సంచే-పాలి లేదు కొంగా సంచే-నాలి లేదు
పిచ్చ సంచే-మాలి గాదురా ఓసంగాదేవా! దేవుడికి జాలి
లేదురా. వుండ.

3. తిన బోతే-మెతుకే సున్నా కట్ట బోతే-గుడ్డే సున్నా
తాగ బోతే-నీళ్లే సున్నారా ఓలోకా సంగా! పిల్చ బోతే గాలే
సున్నారా. వుండ.

4. ఇంటా వంటా-పంటాగబ్బా చుట్టు గుడిసె లన్నీ మబ్బా
బతుకు బోతే-నాకే గొబ్బారా ఓనిస్సంగా నీకు! సంగ రక్షా-
బిరుదా మబ్బారా. వుండ.

5. అసా మీాలా-చరణా కోలా పోలీసులాం-పోసువాలాం
యింత కంటే-జైలు మేలేరా ఓసురు సింధా! మా జీవనమే మాకే
గోలారా. వుండ.

6. బాల్యమునా-పాలా ప్రాసా-పసుచుకుర్రా కైనా సొగసా
ముసలికైనా-బేదా కాసారా ఓవ్యాసంగా కాయా! ఈ బ్రతుకు
మీాదా-దేంటా ధ్యాసారా. వుండా.

7. వెతలా మరహా-దిక్కు సారా పోలీసులా చేతా-చెసూర్కు
రాత్రి పగలూ-మాకే పహారారా ఓ నరు బాంధూ! దుఃఖములా-
నెదా దోయరా. వుండ.

8. మొక్క బోతే-నక్లే లేవు యొక్క బోతే-బ్లే రావు
కుడువ పుంటాకూళ్లే లేవూరా ఓజ్ఞానా సంగా! చదువ నైనా-బళ్లే
లేవురా. వుండ.

9. బ్రాహ్మణాల-కెల్లా దూరం వైశ్య మణులాం-కెల్లా జేరం
శూద్ర జనులా-కెల్లా సారంరా ఓముక్తి సంగా! మే మెందులకీ
భూమీా భారంరా. వుండా.

10. ఆరంజ్యోతి-అమ్మ గాదా వసిష్ఠుడూ-తండ్రే గాదా
పారాశరుడూ-బంధునే గాదా ఓశిష్టా సంగా! ఇంత కంటె
శిష్టూ లెవరూరా. వుండ.

11. పరా త్పరుడు అయ్యా గాగా-పరమేశ్వరి అమ్మగాగా
భేదమూలా-కెడా మేదిరా ఓ అజ్ఞానా సూరా! భేద వాదా-
మూలా, మేదిరా. వుండా.

## ౨

## ఆవులకాపరులు

### మోహన - ఖండగతి - ఏక

### కాపుబాలిక

1. కోసాన బోయేటి - కోరబొల్లావా
పర్గును పరుగున బోయె - పాల బొల్లావా
మేత దావిణి బడ్డ - మేలంపు టావా

మాచర్ల అడవులు - మనవి గావోయి
మరపు చొప్పున బోయి - మాట దెచ్చేరు.

### ఆవు

2. పాలాకు పచ్చలా - పరువంపు పడుచా
ఆద్దాల రవికలా - ముద్దులా పడుచా
తంగేటి పూవులా - ధరియించు పడుచా

మాచర్ల అడవులూ - మనవి కాక్షేమి ?
పులిదేవు పడ్డినా - మరలి వచ్చేమా.

### బాలకుడు

3. కోర కొమ్ముల తోటి - కొమరొప్పు బసవా
పులి మచ్చ వన్నెతో - పొలు పొందు బసవా
నీటి దాణివిబడ్డ - నీలంపు బసవా

చంద్ర వంకా నీళ్ల - చాయబోకోయి
మాచర్ల మడుగులు - మరచి పోవోయి.

## బ స వ డు

4\. చిరి కోల బట్టిన - చిన్ని బాలుడా
పద్ది మాటల నొప్పు - ముద్దు బాలుడా
పిల్లనగ్రో వూదు - పిన్న బాలుడా

మాచర్ల అసవులు - మనవి గాకేని
బ్రహ్మన్న అడ్డితే - పారి వచ్చేనా.

# 3

## బు ర్ర క థ

### శంకరాభరణము - చతుశ్రగతి - ఏక

1\. రామ రామ శ్రీరామా రామా - రామా రఘు రామ
తక్కెళ్ళ జగ్గని ధర్మ బోధలు-తలపున నిలపండి
ఆది కాలమున అందరు జనులు-అన్న దమ్ములండి
నదులు వనంబులు నానా మృగములు-నాల్గు సంద్రములు
కొండలు వంకలు జలములు పొలములు-కుంటలు చెల యేర్లు.
కాయలు పండ్లు పాడి పంటలు-ఘన మయినా యిండ్లు
అంతరువులా భేదము లేక-అందరి సొమ్మండి
కుడవా గట్టా వొకరికి బెట్టా-కొదవే లేదండి
నానీ భేదము లేక లోకము-నడుస్తు వుండేది
మనసు లోపలా చీకుచింతలు-మందుకైన లేవు
తొత్తుల దొరల భేదము లేని-తోడు బంటులండి
అందల మెక్కే మోసే భేదము-లసలే లేవండి
ధనికుల పేదల తారతమ్యముల్-తలలు చూపలేవు

అరుదైన ఆకలి బాధ లప్పుడు-అంకురించ లేదు
ధనమును గొల్చే దుష్టరోజులు-దాపరించ లేదు
తిరిపెము కొరకై ధనికుల సేవలు-దేవురించ లేదు
పూటకి సద్దకు సద్దికుంటులు-గోడు జెంప లేదు
నాపులు రేపులు మలమల మాడుచు-నాల జెంప లేదు
భాగ్యము లొక్కటి పస్తు లొక్కటి-పొందియుండ లేదు
కోరలు మస్తుగా నీచ భోగముల-దొర్లుచుండ లేదు
నాటిమా పనినేమో పరువు తక్కువను-భ్రాంతిలో పడ లేదు
రామ రామ శ్రీరామా రామా-రామా రఘు రామ.

తొల్లిటి జగతి ధర్మ బోధలు-తలపుల నిలపండి
కృత యుగ మందలి ధర్మము లెల్ల-క్రిందు మీదు గాగ
నాశము తోటి కలియుగ మందే-పండి పోయె నండి
నాటి ధర్మములు లోక మంతట-పరిసి పోయె నండి
యొక్కడ చూచిన ఆర్భాటములె యొక్కడ ఘోషములె
యొక్కడ చూచిన పోట్లండి-యొక్కడ కలవరమె
సనాతనంబున జీవ యాత్రలు-సలుపుట దుర్ఘటము
లోక మందున చక్రవర్తియై-లోభు డేలు చుండు
లోకము లోని ద్రవ్య మంతయు-లోభుల పరమయ్యె
అంతా నాదే అంతా నాదే-అందురు జనులండి
అంతా మనదే యనెడు రోజులు-అంతరించె నండి
పరుగెడు కాకులు యిండ్ల మీదుగా పార వేచు నండి
యెంగిలి చేయి కాకుల నైపు-విసరదు యిల్లాలు
నారాయణమ్మలు యిల్లె యంటూ నడతురు యింటింట.
యెవరో కొందరు అరుపు కొందురు-యెల్ల ద్రవ్యములను
కోటికి కొక్కరై వున్నారండి-కోటీశ్వరు లంటూ

కుచేలు లందరు అయినా రండి-కోట్ల కొలది గాను
కోటీశ్వరుల కునిష్టి బిడ్డలు-కోట్లకు కర్తలట
మనుమతె గాదు మనంతాలు-నూరు నూక్క లంట
అరువు జెప్పితే అడ్డగ కూలి-పనికి పాతి కెంట
రామ రామ శ్రీరామా రామా-రామా రఘు రామా

౩. తక్కెడ జగ్గని ధర్మ పన్నుముల్-దలచి బ్రతుక రండి
ధనికులు బొర్రల నిమురు కొందురు-తలప రోకరి బాస
చేతుల వేళ్ల పనులు ముట్టక-చెడి సోమరు లయిరి
కాలి మీదనే కాలు వేసుకొని-కాలం బుచ్చేరు
భాగ్య వంతులకు బీద లెల్లరు-బానిస లయినారు
పొద్దు గూకులు చాకిరి జేస్తురు-బొక్కెడు కూటికిగా
యెంత జేసినా తృప్తిలేదయా-యజమానుల కెల్ల
రోగం రాని నొప్పి రాని-నాగా దప్పదయా
కూలికి విలువ గలదని మీరు-నట్టు తెలుసు కొండి
కూలికి దగిన విలువ బుచ్చుకొనే-కూలికి మరి పొండి
నీళ్ల కూలికి వొప్పు కొంటిరా-నెనరు జెరుపు కొంద్రు
పని వాండ్లందరు యేక మయితిరా-ప్రపంచమే మీది
ఐకమత్యమే అన్ని పనులకు-ఆధారము సుండి
శ్రేణులు గట్టి సమ్మెం గట్టితే-చెల్లును మీమాట
కొట్టా వద్దూ తిట్టా వద్దుకోర్కెలు నిడి వేరుగా
అసహాయ యోగము తరుణము చూచి-అవలం బించండి
దానిక్కి మిగిలిన మంత్ర తంత్రములు-ధరలో లేవండి
శంకలు దక్కి మీరలెల్లరు శపథము జేయండి

సమతా ధర్మం ప్రపంచ మందున స్థాపింతురు గాని
కృత యుగ ధర్మం లోక మంతటా కుదుటు బెట్ట గలరు
రామ రామ శ్రీరామా రామా-రామా రఘు రామా.

## ౮

## దయ్యాలపాట లేక ప్రళయ గీతము

### (సుద్దులు)

### వరాళి - ఖండగతి

1. ఓభైరవి దేవి-ఓభద్ర కాళి
బేతాళ కాటిగా-పెద పోతు రాజ
పుత్రె దండల నొప్పె-భువ నైక మాత
శింబోతు చాడమ్మ-చెండి శివశక్తి
కంతాలు నులుపేటి-కంబాలనాగి
మారెమ్మ అంకమ్మ-మద్దిరాలమ్మ
రండెల్ల పోదాము-రణరంగమునకో

2. కత్తులు అంబులు-గండ్ర గొడ్డండ్లు
ఈటెలు బాకులు-విచ్చు కత్తులును
పెద్ద ఫిరంగులు-భిండివాలములు
రంపాలు ఇరిసెలు-రహి నొప్ప బట్టి
ఆవేశ పర వశు-లైన సైనికుల
కావ్విన గుఱ్ఱాల-గొడ్డె పొట్టేళ్ల
పీరుల రొమ్ముల-ఏనుగు తలల
చిదిమి ముక్కలు గాగ-చీల్చు తున్నారో.

3. కారేటి రక్తాన్ని-కలగల్పు జేసి
కడవల బానల-గాబుల నింప
పట్టించి వుంచుతా-పానకంబునకు
తందనా లాడుతూ-తాగుదురు గాని
తలకు బోసు కొనండి-తాన మాడండో.

4. కోళ్లాది శవములు-కోయించి నాను
కుప్పలు వేయించి-కుళ్లి పోకుండ
ఎండ బెట్టించాను-కొండల యెత్తు
పీనుగు గుట్టల-పేట లమర్తు
కేరింత లాడుతు-కేకిసలు గొడుతు
బువ్వంపు బంతులు-పొలుపు మీరంగ
తిని తిని మీకెల్ల-త్రేపంగ వచ్చో.

5. కండల ముక్కల-కారుల బట్టి
కుమ్మున బెట్టించి-కొద్దిగా కాచి
కరపచ్చి ముక్కల-కమిలి పోకుండ
కొత్త నెత్తుట బెట్టి-కోరలబట్టి
చెలిమెల రక్తము-చిమ్మి కారంగ
పలల ఖండములను-బక్షింత్రు గానో

6. పుట్టెల నెల్లను-పోగు బోయించి
తేరిన నీళ్లలో-తెల్లగా గడిగి
పెట పెట లాడంగ-పేలాలు వేచి
పొడి పిండిగొట్టించి-బొక్కుదురు గానో

7. కోళ్లాని శవముల-సుళ్లు వొలిపించి
నులి వెచ్చ రక్తము-నూనెయు గలిపి
గంగాళముల బట్టి-కని గుళ్లు బోసి
గట్టి పకోడీల-కరణి వేయించి
భేతాళ గణముకు-బెట్టింతు విందో.

౫

## యశోదా వైభవము

(వేదాంతపరిభాషలో మనోరాజ్యము అను సాధనను సూచించును)

1. నాదు ముద్దుల మొలక - నా రామ చిలుక
చిన్నారి పొన్నారి - చిరి పొన్న కాయ
నాదు నోముల పంట - నారాము జంట
పాడరా పాపాయి - ఆడరా తండ్రి-నాదు.

2. అగరు నూన బెట్టి - అంటేను తలను
పచ్చ కర్పూరంపు - నలుగు బెట్టేను
పన్నీటి కడవల - లాల బోసేను
ముద్దులు గులకరా - ముత్యాల సరమా - నాదు.

3. నీలి మబ్బుల గేరు - నెమిలి రాయుండ
రంగు రంగుల రుమాల్ - చుంగులు చెక్కి
కలికి తురాయినీ - కమరంగ బెట్టి
గల్లు గల్లున మోగు - గజ్జెలు గడుదు - నా.

4. తేనె పాటలు రేగె - దిక్కులు పాకి
పాల కరుళ్లపై - పరుగులు దీసె

ఈరెడు లోకాలు - వెక్కస మంది
సంతోషమున పొంగి - సొక్కి సోలంగ-నా.

5. చిన్ని పెదవుల తోటి - చిరు నవ్వు నవ్వి
ఎఱ్ఱ బుగ్గలతోటి - వెలు గార నవ్వి
పాల బుగ్గల తోటి - పకక్కన నవ్వి
చూపరా స్వర్గంపు - చోద్యాల నెల్ల.

౬

1. గొల్ల పిల్లల అల్ల రొద్దురా - పోకిళ్ల పోన్నా
నలుగురి నోట - నాన వద్దురా.

2. గుప్పిటి నిండ - పప్పులు బెట్టేను - ఒప్పుల కుప్పా
తియ్యన్ని - తాయం బెట్టేను.

3. చుంచు దువ్వి - పించెం బెట్టేను - అందాల ముక్క
బిళ్లంగోడు - చేత బెట్టేను -గొల్ల

4. పట్టు కుచ్చుల - పట్టి గట్టేను - ముద్దుల ముక్వ
బుజ్జి బొజ్జకు - గజ్జెలు చుట్టేను-గొల్ల

5. బబ్బ బోసి - జుబ్బా దొడిగేను - బంగారుకొంప
బబ్బో బెట్టి - చిచ్చి గొట్టేను-గొల్ల

౭

రోటి పాట

మధ్యమావతి - త్రిశ్రగతి - ఏక

1. సాధన చతుష్టయపు - సంపత్తి గన్న
అతడె పో సద్గురూడు - అతడే పరశివుడు.

2. వర్ణాశ్రమాచార - హావి దప్పితే
తౌరు మార్గై పోను - ధర్మము లన్ని

3. పల్నాటి రాజులు - పాటి దప్పేరు
మాచర్ల దప్పేను - మారాజు కపుడే.

4. కదుల్లై కత్తులు - వెదుల్లై గదలు
రండెమ్మ మీరంత - దండు బోదాము.

## ౧

## తంధానపాట

పల్నాటి మిద్దెలకు వాసాలు లేవు
కొండీటి బ్రాహ్మలకు - మీసాలు లేవు
మాచర్ల కోళ్లకు - రోసాలు లేవో - తంధాన.
మాచర్ల దొరలకు - వేషాలు లేవు
అజ్ఞాన చేట్టలకు - దోసాలు లేవు
పల్నాటి రెడ్లకు - రోసాలు లేవో - తంధాన.

## ౬

## చిందుపాట

### పల్లవి

విడదలో-విడదలో-విడదలో-విడదలో

### అనుపల్లవి

అందరూను ఆంధ్రులో - అందరూను ఆర్యులో వి.

1. మాలలకును మాదిగలకు - ఎరుక లేనాదులకును
ఆని మాంధ్రులైనవారి - కంపరికిని విసుపలో - విసుపలో

2. తాగ నీళ్ల బావులూ - తానమాడె చెరువులూ
చాప కూళ్ల సత్రగూలు - సామి వారి పూజలు - విసుపలో.

3. ఆంద రెమ్మ పాలు యిచ్చె - అంప రెయ్యి బువ్వ బెట్టె
కల్ల బొల్లి భేదములకు - కారణముల తెల్పరో - విసుపలో

4. కట్టెలన్ని మట్టి వాయె - కట్టెలోది దేవు డాయె
కట్టె కట్టె నడుమ మనకు - వట్టి భేద మెట్టెనో - విసుపలో,

5. నీవు నేను నీళ్లు నిప్పు-చెట్టు పుట్ట గట్టు మిట్ట
చేప జెల్ల దేవుడైతె - చెప్ప రాని దెవమురో - విసుపలో.

6. అంట రాని దేవు డంట - అంట వచ్చె దేవు డంట
చదువు కున్న వాళ్ల కంటె - చాక లోళ్లె మేలురో - విసుపలో.

7. అందరి నోస్ట పొద్దు బొడిచె - అందరి నోసట పొద్దు గూకె
ఎల్ల వారి కంటె నీవు-ఎక్కు వేల చెప్పరో - విసుపలో.

8. నిన్ను గొడితె పాలు గారి నన్ను గొడితె నీళ్లుగారి
గొప్ప కొద్ది రకము లిందు-కలవొ లేవొ తెల్పరో - విసుపలో.

9. ముప్పై కోట్ల దేవతలతో-ముచ్చటైన పుణ్య భూమి
బానిసత్వ మనెడు పాము-పంట లేల పండెరో - విసుపలో.

[వీరమ్మ అనే ఆమె కృష్ణాజిల్లా ఉయ్యూరు కాపురస్తురాలను గొల్ల మనిషి. ఈమె తన భర్త చింతయ్య అను వానితో సహా గమనము గావించిన కథ నాటకముగ వ్రాయ బడ్డది. ఈ క్రింది పాట లానాటకములోవి.]

# ౧౦

## పువ్వు పాట

(నాగమ్మ అను ఆమె తాను ప్రేమించిన పురుషుడు తనను ప్రేమించనందున తన ప్రేమను వెల్లడించక పువ్వును భావించి మనో భావములను చెప్పుకొనుట.)

1. కొమ్మలలో నక్కి—కమ్మ తావుల వెల్ల
 గుమ్మ గుమ్మన జల్లు—పువ్వా
 రాజు లేని యట్టి – రాత్రి రాణించునా
 రెక్క లెన్నున్ననూ – పువ్వా.

2. కమ్మ తేనియ వెల్ల – కన్నీటి ధారలై
 కాల్వలు గట్టినా – పువ్వా
 అందని పండ్లకై – అఱ్ఱు చాచుటె కాని
 ఆశలే దీరునా – పువ్వా.

3. మండు వేసవిలోన – ఎంత వేడిమి గొట్టి
 వాడి వత్తయి పోయి – పువ్వా
 జాలి నిద్దుర బోయి – సావాస గానిపై
 సక్కనీ కలగనవె – పువ్వా.

4. ఆకులలో అణిగి – మాకులలో మణిగి
 మగ్గి మాయము గానె-పువ్వా
 పదుగురిలో వెల్లడై – పలచ జనమే కాని
 పసదేమి జెప్పవే – పువ్వా.

5. ఇవ్వేళ యింటిలో - యెగిరి పడదమె గాని
ఇదని త్రైమా మనకు-పువ్వా
మరు నిమిషమే జూడ-మంటి మీదను రాలి
మలినమై పోతుందె-పువ్వా.

6. ఈలోక మర్యాద-లిరుకు లన్నీ దాటి
యెగిరి పోయినాకనో-పువ్వా
ఓపిన మట్టుకు - వలపు సంద్రము లోన
ఓల లాడుదు గాని - పువ్వా.

## ౧౧

## మేకపాట

(వీరమ్మ పేరంటాలు తన గొల్ల బోయుడు అడవికి మందలు గాయ బోగా ఒక మేకను అతని యోగక్షేమము లడుగుట.):

1. పొలము వెంట దిరుగు కుంట-బొల్లి మేక
మా బోయుణ్ణి చూశావంటె-బొలి మేక ?
పొలము లంక తిరుగు తుంటి-బాగ్గ శాలె
నా పోతు వంక జూసు కుంట-బాశాలె.

2. మేక పోతును చూసుకొంటు-బొల్లి మేక
మా మేన మామను జూడలేద-బొలి మేక ?
మేక పోతును చూస్తుంటె-బాగ్గ శాలె
మేతమీదా మతి బోదె-బాశ్శాలె.

3. కొంకి కట్టి గొంగడి గూడ-బొల్లి మేక
నా గుట్టు కొల్ల గొంటాయె-బొలి మేక

బైరి గడ్డం పల్ల తోక-బాగ్గె శాలె
నా బైసి తీసి వేస్తాయె-బాశాలె.

4. కోరమీసం గీటితేను-బొల్లి మేక
నా కనుల పండు గౌతాదె-బొలిమేక
కోరకొమ్ము చూస్తేను-బాగ్గెశాలె
నా గుట్టు కోలు పోతాదె-బాశాలె.

5. బ్రారు టంగలు వేస్తాడె-బొల్లి మేక
నా బాగ్యాల రాసి వాడే-బొలిమేక
చిటుకు పోటుకు మాకు తుంటె-బాగ్గెశాలె
నా చింతలెల్ల తీరు తాయె-బాశాలె.

6. తేనె పలుకు పలుకుతాడె-బొల్లి మేక
తెలి నవ్వులు చిలుకు తాడె-బొలిమేక
అఱిగండ్ల చూపులాకు-బాగ్గెశాలె
నా కడగండ్లు బాసి పోనె-బాశాలె.

7. ఎండ కెండి వాన దడిసి-బొల్లి మేక
బల్-జోగి కంటె చాగివాడె-బొలిమేక
ఆకు మేసి అలమునవిలి-బాగ్గెశాలె
రాగి బోగి చాగివాడె-బాశాలె.

8. కల్లా కాడు లేని వాడె-బొల్లి మేక
గొల్లడయినా గొల్లడమ్మ-బొలిమేక
చిట్టు బుస్సు లెరుగ నట్టి-బాగ్గెశాలె
మేక మెత్తని వాడమ్మ-బాశాలె.

# ౧౨

## సంగీత నాపసాని - తోటపాట

## (తిక్కన అను నవలనుండి తీయబడినది)

1. మావి గున్న మీద - మరుగున దాగుండి
కూకూను పూదేటి - కోకిలమ్మ
బుల్లి బుల్లి యిగుళ్లు-గిల్లి నీకు బెట్టి
గొంతు చక్కగ చేతు-కూయ వమ్మ.

2. మల్లె పూరెక్కల - మాటున నక్కుండి
తూ-అని పాడేటి - తుమ్మెదమ్మ
తీయని పూదేనె - తీసి నీకూబోతు
కల రవమున సుతి-గలపవమ్మ

. తోక విప్పుకోని - తాకిట ధిమ్మని
తైతక్క-లాడేటి - నెమిలమ్మ
గురివింద పూసల - కుతికంటు జేయిస్తు
అల్లిబిల్లి నాతో - ఆడ నమ్మ.

. అంబర మార్గాన - అల్లల లాడుచు
వుయ్యాల లూగేటి - తీగెసాని
చేతిలో- చెయి బెట్టి-చెట్ట పట్టాల్ బట్టి
తెమ్మెర గాలికి - తిరుగ రమ్మ.